నం తదేవాగ్నిస్తేన జ్ఞానాగ్నినా దగ్ధాని శుభాశుభలక్షణాని కర్మాణి యస్య త
మాహుః పరమార్థతః పండితం బుధాః బ్రహ్మవిదః॥

The seeing of in-action in action &c., is here extolled. సమారంభాః here means karma (all actions); యస్య means of one who has realised in-action in action &c.; Sankalpas are the tendencies which are the cause of desire. The man who sees in-action...and whose karma is free from..., performs karma for nothing, with no special object in view, like the activity of the members of the body; if he is engaged in active life, he does karma for the good of the masses; if he has renounced, he does karma for the bare sustenance of life; the knowers of Brahma call that man who has burnt up all actions, good and bad, by the fire of knowledge in the shape of the realisation of in-action in action &c., a Pundit in reality.

———:׃o׃:———

తాత్పర్యము.

పూర్వశ్లోకమునందు జెప్పబడిన అకర్మమునందు కర్మదర్శనము, కర్మమునందు అకర్మదర్శనము ఈశ్లోకములో స్తోత్రంపబడుచున్నది. కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును చూచునట్టి విద్వాంసుడు కర్మములను, కోరికలను, సంకల్పములను, కర్మాకర్మదర్శనజ్ఞానముచేత దహింపచేయును. అట్టివాడు ప్రారబ్ధకర్మవేగముచేత ప్రవృత్తినవలంబించినయెడల లోకసంగ్రహముకొరకు కర్మమును చేయదగినకాలమందే శాస్త్రమునతిక్రమింపక చేయును. నివృత్తినవలంబించి చేసినయెడల జీవనమాత్రముకొరకు చేయును. అట్టివానినే పండితునిగా విద్వాంసులుచెప్పుచున్నారు. న్యాయవైశేషికాది శాస్త్రములను చదివినవారయి పండితులవలె గనబడుచున్నారేకాని వాస్తవముగ వారుమిథ్యాజ్ఞానముకలవారు కనుక పండితులుకారు.

---

*Notes.*

కామసంకల్పః:— The experiences or impressions of the Jiva in the previous births remain as inborn tendencies (సంకల్ప) of the Jiva in the present birth. These tendencies are the cause of desires. These tendencies are called what is known as *nature*; desires are always

cherished according to these tendencies. So one must effort to root out the inborn tendencies as it is possible to conquer nature. If a man does karma freed from the influence of desires, his actions may seem to be like the meaningless activity of a mad man. It may be asked why then should he do karma at all? The man whose engagements are free from desires will do karma for the good of the masses or for his mere sustenance of life. He is not like mad man whose karma is objectless.

పండితః:— Pundit is not one who has studied merely sciences and arts. పండా means knowledge of the self. To exclude the scientists from the list of real Pundits, the expression "తమాహుః పండితం" is used.

---

త్యక్త్వా కర్మ ఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః॥ 20

——:0:——

టీక.

సః = (కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును చూచునట్టి) ఆపురుషుడు, కర్మఫలాసంగం = కర్మఫలాభిమానమును, ఫలాభిలాషను, త్యక్త్వా = విడిచి, నిత్యతృప్తః = సర్వకాలములయందును, (స్వాత్మానందానుభవముచేత) తృప్తుడైనవాడును, నిరాశ్రయః = ఆధారశూన్యుడును: (అగుచు) కర్మణి = కర్మమందు, అభిప్రవృత్తోఽపి = ప్రవర్తించినప్పటికిని, కించిత్ = ఒకకార్యమును, (ఏకర్మమును) నకరోత్యేవ = చేయుచున్నవాడే కాడు.

He having renounced egoism in karma (agency) and the desire for fruits of karma (ఫలాసంగ), being ever content and seeking no rest anywhere, does not really do any karma, although engaged in it.

-::0::-

## Com. భాష్యం

యస్త్వకర్మాదిదర్శీ సోఽకర్మాదిదర్శనాదేవ నిష్కర్మా సంన్యాసీ జీవనమాత్రార్థ చేష్టస్సన్ కర్మణి న ప్రవర్తతే। యద్యపి ప్రాక్ వివేకతః ప్రవృత్తః యస్తు ప్రారబ్ధకర్మాసన్ ఉత్తరకాలముత్పన్నాత్మసమ్యగ్దర్శనః స్యాత్ స కర్మాణి ప్రయోజనమపశ్యన్ ససాధనం కర్మ పరిత్యజత్యేవ స కుతశ్చిన్నిమిత్తాత్ కర్మపరి

త్యాగాసంభవే సతి కర్మణి తత్ఫలేచ సంగరహితతయా స్వప్రయోజనాభావా ల్లోకసంగ్రహార్థం పూర్వవత్ కర్మణి ప్రవృత్తేఽపి నైవ కించిత్ కరోతి జ్ఞానాగ్ని దగ్ధకర్మత్వాత్ తదీయం కర్మాకర్మైవ సంపద్యత ఇత్యేతదర్థం దర్శయిష్యన్నాహ। త్యక్త్వేతి। త్యక్త్వా కర్మస్వభిమానం ఫలాసంగంచ యథోక్తే జ్ఞానే నిత్యతృప్తో నిరాకాంక్షో విషయేష్వియ్యర్థో నిరాశ్రయ ఆశ్రయరహిత ఆశ్రయోనామయదా శ్రిత్య పురుషార్థం సిసాధయిష్యతి। దృష్టాదృష్టేష్టఫలసాధనాశ్రయరహిత ఇత్యర్థః తేనైవంభూతేన స్వప్రయోజనాభావాత్ ససాధనం కర్మ పరిత్యక్తవ్యానేవేతి ప్రాప్తే తతో నిర్గమాసంభవాత్ లోకసంగ్రహచికీర్షయా శిష్టవిగర్హణాపరిజిహీర్ష యా వా పూర్వవత్ కర్మణ్యభిప్రవృత్తోఽపి నిష్క్రియాత్మదర్శనసంపన్నత్వా న్నైవ కించిత్ కరోతి సః॥

The man who sees in-action in action becomes liberated from karma by reason of the very realisation of in-action in action, abandons all karma, just exerting for the bare sustenance of life and engages in no-karma, although he had engaged himself in action before the said realisation. On the other hand, a man who has been performing karma may at any subsequent time attain the realisation of the self. He will then renounce all karma with its accessories seeing no object to gain by that karma. He, though unable to renounce karma for some reason and though engaged in action as before with a view to set an example to the world devoid of any attachment for the fruits and as such finding no object of his own to gain in the action, does not really do anything.

His action is really as good as in-action, as all his actions are burned up by the fire of knowledge. To show this sense the Lord says "త్యక్త్వాకర్మ".

He who has given up egoism in action and attachment for the fruits by reason of his knowledge above referred to, who is ever content, having no desire for the sensuous enjoyments, who seeks no reliance on any thing whereby to gain any object of his own *i e.*, who seeks for no means of acquiring the desirable fruits, visible and invisible, for want of any selfish object in view,

who abandons all karma with all its helps but who, for some reason, finding it impossible to retire from action and with a view to benefit the world or avoid the censure of the pious men, engages himself in work as before, does not really *do* karma as he is endowed with (the wealth of) the realisation of the actionless self.

———:O:———

### తాత్పర్యము.

వివేకము కలుగుటకు పూర్వమునందు కర్మమునందు ప్రవర్తించినప్పటికిని వివేకము కలిగినపిమ్మట కర్మమునందు అకర్మమును అకర్మమునందు కర్మమును చూచు బ్రహ్మజ్ఞాని ఆత్మజ్ఞానముకలవాడై సన్యాసియగుచు వైదిక లౌకిక కర్మమునందు కర్తృత్వాద్యభిమానుడై ప్రవర్తించక కర్తృత్వాభిమానములేక జీవనమాత్రోపయుక్తమైన కర్మమునందు ప్రవర్తించును. ఆత్మజ్ఞానికి ఏదో కారణమువలన కర్మమును వదలుట సంభవింపకపోవుచుండగా స్వప్రయోజనము లేదు గనుక కర్మమునందును తత్ఫలమునందును కర్తృత్వభోక్తృత్వాద్యభిమానములను వదలుకొని లోకసంగ్రహముకొరకుగాని శిష్టజనులవలన నిందపోగొట్టుకొనుటకుగాని వివేకము లేనప్పటివలెనే కర్మమునందు వాడు ప్రవర్తించినను జ్ఞానాగ్నిచే సకలకర్మములను కాల్చివేసినవాడగుటవలన తనదృష్టిచేత ఏకర్మమును చేయనివాడనుచున్నాడు. అతనికి కర్మము కర్మముకానేరదు. ఆత్మజ్ఞాని సర్వకర్మఫలాభిలాషనువదలి విషయానుభవమునందు విముఖుడై స్వాత్మానందానుభవముచేత తృప్తుడై దృష్టఅదృష్టఫలప్రాప్తిసాధనములను ఆశ్రయించక కర్మప్రవృత్తుడైనను కర్మచేయుచున్నవాడుకాడు.

---

*Notes.*

కర్మఫలాసంగం:— This may be explained in two ways కర్మణితత్ఫలేచ ఆసక్తిం (కర్మమునందునుతత్ఫలమునందును...); (2) కర్మఫలో దేహః తత్రాసంగం body is the fruit of karma; attachment for the body is ఆసంగం, as కర్తా భోక్తా, వక్తా, శ్రోతా, ద్రష్టాహమితి.

నిత్యతృప్తః:— నిత్య may mean always; or నిత్యేన ఆనందైకరసేన స్వాత్మనా సాక్షాత్కృతేన బ్రహ్మణైవ.

దృష్టాదృష్ట:—దృష్టఫలం is wealth, prosperity &c.; అదృష్టఫలం is the fruit of Swarga &c. If by the force of past karma, the knower of self has

to do the karma of begging, he must not have egoism in the act. The difference between an enlightened man who engages himself in action and the ignorant man who does karma is the absence of egoism and attachment for the karma and its fruits in the case of the former.

“ సర్వం బ్రహ్మైవపశ్యతో విదుషః స్వార్థపరార్థా ప్రవృత్తిర్న సంభవతి క్వచిద్వాస
సనయా అంగీకరణే కర్మణి ప్రవృత్తో పి స్వయమకర్తైవ భవతి ”.

---

నిరాశీర్యత చిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం ॥ 21

—:0:—

టీక.

నిరాశీః = ఆశలులేనివాడును, యతచిత్తాత్మా = నియమింపబడిన చిత్తమును, దేహమును, కలవాడును, త్యక్తసర్వపరిగ్రహః = విడువబడిన సకలవస్తుసంపాదనము కలవాడును, శారీరం కేవలం = శరీరమునిలుచుటకుమాత్రము తగిన, కర్మ = కర్మమును, కుర్వన్ = చేయుచున్నవాడును, (అయినమానవుడు) కిల్బిషం = (పుణ్యపాపములయిన) సంసారమును, (లేక) బంధమును, నప్రాప్నోతి = పొందడు.

Free from all desires, having controlled the mind and body, having abandoned the acquisition of all things, doing only bodily action, he does not incur sin.

—::0::—

**Com.** భాష్యం.

యఃపునః పూర్వోక్తవిపరీతః ప్రాగేవ కర్మారంభాత్ బ్రహ్మణి సర్వాంత
రే ప్రత్యగాత్మని నిష్క్రియే సంజాతాత్మదర్శనః స దృష్టాదృష్టేష్టవిషయ వివర్జిత
తయా దృష్టాదృష్టార్థే కర్మణి ప్రయోజనమపశ్యన్ ససాధనం కర్మ సంన్యస్య శరీ
రయాత్రామాత్ర చేష్టో యతిర్జ్ఞాననిష్ఠో ముచ్యత ఇత్యేతమర్థం దర్శయితుమాహ
నిరాశీరితి। నిరాశీః నిర్గతా ఆశిషో యస్మాత్ స నిరాశీః యతచిత్తాత్మా చిత్తమం
తఃకరణం ఆత్మా బాహ్యకార్యకారణసంఘాతః తావుభావపి యతౌ సంయతౌ
యేన స యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః త్యక్తః సర్వపరిగ్రహో యేన సః
శారీరం శరీరస్థితిమాత్రప్రయోజనం కేవలం తత్రాప్యభిమానవర్జితం కర్మ కు

ర్వన్ నాప్నోతి నప్రాప్నోతి కిల్బిషం పాపమనిష్టరూపం ధర్మంచ ముముక్షోరని
ష్టరూపత్వాత్ ధర్మోఽపి కిల్బిషమేవ తస్మాత్తాభ్యాం ముక్తో భవతి సంసారా
న్ముక్తో భవతీత్యర్థః। శారీరం కేవలం కర్మేత్యత్ర కిం శరీరనిర్వర్త్యం శారీరం క
ర్మాభిప్రేతం ఆహోస్విత్ శరీరస్థితిమాత్రప్రయోజనం శారీరం కర్మేతి కిం
చాతః యది శరీరనిర్వర్త్యం శారీరం కర్మ యదివా శరీరస్థితిమాత్రప్రయోజనం
శారీరం కర్మేత్యుచ్యతే యదా శరీరనిర్వర్త్యం శారీరం కర్మాభిప్రేతంస్యాత్
తదాదృష్టాదృష్టప్రయోజనం కర్మ ప్రతిషిద్ధమపి శరీరేణ కుర్వన్నాప్నోతి కిల్బి
షమితి బ్రువతో విరుద్ధాభిధానం ప్రసజ్యేత శాస్త్రీయంచ కర్మ దృష్టాదృష్టప్ర
యోజనం శరీరేణ కుర్వన్నాప్నోతి కిల్బిషమిత్యపిచ బ్రువతోఽప్రాప్తప్రతి
షేధప్రసంగః శారీరం కర్మ కుర్వన్నితి విశేషణాత్ కేవలశబ్దప్రయోగాచ్చ
వాఙ్మనోనిర్వర్త్యం కర్మ విధిప్రతిషేధవిషయం ధర్మాధర్మశబ్దవాచ్యం కుర్వన్నా
ప్నోతి కిల్బిషమిత్యుక్తం స్యాత్ తత్రాపి వాఙ్మనోభ్యాం విహితానుష్ఠానపక్షే కిల్బి
షప్రాప్తివచనం విరుద్ధమాపద్యేత ప్రతిషిద్ధసేవాపక్షేఽపి భూతార్థానువాదమా
త్రమనర్థకం స్యాత్ యదాతు శరీరస్థితిమాత్రప్రయోజనం శారీరం కర్మాభి
ప్రేతం భవేత్తదా దృష్టాదృష్టప్రయోజనం కర్మ విధిప్రతిషేధగమ్యం శరీర
వాఙ్మనోనిర్వర్త్య మన్యదకుర్వాం స్తైరేవ శరీరాదిభిః శరీరస్థితిమాత్రప్రయోజనం
కేవలశబ్దప్రయోగాదహం కరోమీత్యభిమానవర్జితః శరీరాదిచేష్టామాత్రం లోక
దృష్ట్యా కుర్వన్నాప్నోతి కిల్బిషమిత్యేవం భూతస్య పాపశబ్దవాచ్యకిల్బిషప్రాప్త్య
సంభవాత్ కిల్బిషం సంసారం నప్రాప్నోతి జ్ఞానాగ్నిదగ్ధసర్వకర్మత్వాత్ అప్ర
తిబంధేన ముచ్యతఏవేతి పూర్వోక్తసమ్యగ్దర్శనఫలానువాద ఏవైషః ఏవం శారీరం
కేవలం కర్మేత్యస్యార్థస్య పరిగ్రహే నిరవద్యం భవతి ॥

He who, unlike the one just spoken of, even before engaging in action, has realised himself as identical with Brahma, the actionless, and the resident in all as the Prathyagathma, who having cast off all desires for the objects of pleasure, visible and invisible and thereby finding no object to gain from doing karma intended to yield the visible and the invisible fruits, abandons all karma with all its accessories except action necessary for the bare

sustenance of the body, is liberated being a devotee of knowledge. To teach this the Lord says "నిరాశీ". నిరాశీః is one from whom desires have gone away; చిత్త mind, is the inner sense; ఆత్మ is the external body, the aggregate of causes and effects; one who has controlled the mind and the body is యతచిత్తాత్మా. The Yathi above spoken of doing karma for the bodily sustenance, without any egoism in so doing, does not incur sin in the shape of evil and dharma. Even dharma (good action) is equally a sin in the case of one desirous of Mokoha, as it is the cause of bondage. What does the expression 'శారీరం కేవలంకర్మ' "mere bodily karma", mean? Does it mean karma performed by the body only or karna performed for the mere bodily maintenance? One may say of what avail is the discussion whether bodily karma means karma performed by means of body only or karma performed for the mere bodily sustenance. The reply is as follows:— If the words "bodily karma" are taken to mean karma done by means of the body only, this inconsistency would arise, that he who performs, by means of the body, the which is karma prohibited and is productive of visible or invisible results, would not incur sin. If the words 'bodily karma' are taken to mean 'karma done by means of the body' the fault of contradicting what is not necessary to do so would arise, namely that he who performs by means of the boby, karma sanctioned by the Sastra and productive of visible or invisible results, would not incur; sin the use of the attributive expression శారీరం "doing bodily కర్మ" and of the word 'mere' కేవలం, would imply that he who performs karma lawful and unlawful and known as Dharma and Adharma, by speech and thought would incur sin. Here the inconsistency of incurring sin would arise in the case of performing the lawful karma by means of speech and thought. Again to say that he who performs unlawful karma by means of speech and thought would incur sin, is subject to the fault of unnecessarily reiterating what has already been said. If the expression 'bodily action' is understood in the sense of 'action done for the mere bodily maintenance' then the sense of the expression comes to this—He who does no other act enjoined as lawful or prohibited as unlawful by the Sastra and productive of results visible and invisible, by means of deed, speech and thought

and who, by deed, speech and thought, performs, in the view of the world, just those acts necessary for the mere sustenance of tL body, devoid of all attachment and egoism in the form 'I do', does not incur sin. Since it is impossible that such a man can do evil acts known as sin he will not get into the sin of Samsara; he is said to be completely emancipated without any impedement, as he has burned up all karma by the fire of knowledge. So this verse simply reiterates the results of realisation already described. Thus the expression 'by mere bodily action' as explained above becomes faultless.

———::0::———

## తాత్పర్యము.

ఏమానవుడు కర్మములను ఆరంభింపకమునుపే సర్వాంతరుడును, ప్రత్యగాత్మస్వరూపుడును నిష్క్రియుడును అయిన బ్రహ్మము నేననియెడు జ్ఞానముకలవాడగునో అట్టివాడు ఇహాముత్రాఫలభోగవిరాగుడగుటచేత, అట్టిఫలమును కలుగజేయు కర్మమునందు ప్రయోజనము లేదని తలచుచున్నవాడగుచు కామసంకల్పములతోగూడ కర్మమునువిడిచిపెట్టి శరీరమునిలుచుటకుమాత్రము తగినకర్మములను చేయువాడును, యతియును, జ్ఞాననిష్ఠుడును, అగుచు ముక్తుడగునని తెలియజేయుటకు కృష్ణుడు ఈశ్లోకమును చెప్పుచున్నాడు. చిత్తమనగా అంతఃకరణము, ఆత్మ అనగా కార్యకారణసంఘాతమగు బాహ్యశరీరము. జ్ఞాని కామసంకల్పములతోగూడ కర్మములనువిడిచిపెట్టి శరిరమునిలుచుటకుమాత్రము తగినకర్మమును చేయుచు అట్టికర్మమునందు అభిమానమును అనగా ఆదరమునువదలి ఆత్మజ్ఞానమునందు మాత్రమే ఆదరమును కలిగియుండును. "శరీరం కేవలంకర్మ" అనుచోట శరీరముచేత నెరవేర్పదగినదని చెప్పినయెడల దోషముకలదు. శాస్త్రప్రతిషిద్ధకర్మము కూడ శరీరముచేత నెరవేర్పబడవచ్చును. అట్టికర్మమును చేయుచు పాపమునుపొందడని అర్థమువచ్చును అట్లుచెప్పినయడల నిషిద్ధకర్మము నాచరింపగూడదని చెప్పినశాస్త్రమునకుహానివచ్చును. శాస్త్రసమ్మతమగుకర్మమును శరీరముచేతచేసినయెడల శాస్త్రవిహితకర్మమును చేయుచున్నవాడు పాపమునుపొందడని చెప్పినట్లగును. ఇందువలన అప్రాప్తప్రతిషేధమను దోషముకలుగును. అనగావిహితకర్మ

మును చేయుటవలన కిల్బిషముకలుగునని యెక్కడను చెప్పబడకయుండగా చెప్ప బడియు న్నట్లుతలచుకొని అట్లుకాదుసుమీ అనిచెప్పినట్లగును. 'కేవల' శబ్దప్ర యోగమువలన, శరీరముచేత నెరవేర్పదగినది 'శారీరమ్' అనిచెప్పినయెడల ధ ర్మాధర్మములను పేరుగల శాస్త్రవిహితనిషిద్ధకర్మములను వాక్కుతచేను మనస్సు చేతను చేయుటవలన ముముక్షువగువాడు కిల్బిషమునుపొందునుఅనిచెప్పినట్లగును. వాక్కు చేతనుమనస్సుచేతనువిహితకర్మమును చేయుటవలన కిల్బిషప్రాప్తియగునని చెప్పుటవలన జపాదులను చేయవలసినదను శాస్త్రమునకు విరోధమువచ్చును. ప్రతిషిధకర్మమును చేసినయెడల కిల్బిషప్రాప్తియగునని చెప్పినయెడల అప్రాప్తప్ర తిషేధదోషముకలుగును. కాబట్టిశారీరమనగా శరీరముచేత నెరవేర్పతగినది అను అర్థము యుచితముగనుండలేదు. మరియును శరీరమునిలిచియుండుటకుమాత్రము తగినది 'శారీరమ్' అనిచెప్పిన, యతి శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సు చేతను ఇహాముత్రఫలకారణమగు శాస్త్రవిహితనిషిద్ధములయిన ధర్మాధర్మక ర్మములను సాభిమానముగ చేయక, లోకదృష్టికిశరీరవాఙ్మనస్సులయొక్క చే ష్టామాత్రరూపమయిన కర్మమును చేయుచున్నట్లు కనబడుచున్నను తనదృష్టికిప కర్మమును చేయని వానివలెనేయున్నాడు కినుక కిల్బిషమును పొందడు అనిఅర్థ మిచ్చుచున్నది. అట్టివాడు జ్ఞానాగ్నిచేతకాల్చబడిన సర్వకర్మము కలవాడగుటవల ననంసారమునుపొందడు. జనన మరణ కారణమగుటవలన ధర్మముకూడముముక్షు వునకు బంధకారణమై పాపమగుచున్నది.

---

*Notes.*

ఆశిషః = వైషయిక్యః కామనాః

దృష్టప్రయోజనం is శారీరాదికంకర్మ ;

అదృష్టప్రయోజనం స్వర్గసాధనం జ్యోతిష్టోమాదికంకర్మ

If the expression 'కేవలం శారీరమ్' is taken to mean "performed merely by means of the body", the Sanyasins who do karma (జపాదికర్మ) by *speech and mind,* would have to incur sin.

యతచిత్తాత్మ :— ఆత్మా దేహః యతౌ నిరుద్ధౌ చిత్తాత్మా నౌ యేన *i. e.,* One who has controlled the mind and *body* (ఆత్మా).

or ఆత్మ means the self: యతం సంస్థాపితం చిత్తం ఆత్మన్యేవ న క్వచిద నాత్మని యేన *i. e.*, One who has centred his mind on the self alone.

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌచ కృత్వాపి ననిబధ్యతే॥ 22

—:0:—

టీక.

యదృచ్ఛాలాభసంతుష్టః = అయాచితముగాసంభవించిన యాహారపదార్థముతో తృప్తినిపొందినవాడును, ద్వంద్వాతీతః = శీతము, ఉష్ణము, మొదలుగాగలజంటలను అతిక్రమించినవాడును, విమత్సరః = మాత్సర్యములేనివాడును, సిద్ధౌ = (ఆహారాదులు అప్రయత్నముగా) సిద్ధించుటయందును, అసిద్ధౌ = (ఆహారాదులు అప్రయత్నముగా) సిద్ధింపకపోవుటయందును, సమః = సమానమైన బుద్ధికలవాడును, (అగువాడు) కృత్వాపి = (భిక్షాటనము మొదలుగాగల కర్మములను) చేసినను, ననిబధ్యతే = (సంసారముచేత) కట్టబడడు.

Satisfied with what has been gained without effort, having risen above the pairs of opposites, being free from covetousness, and remaining the same in success and failure, one does not become bound though engaged in action. 22.

—::0::—

**Com.** భాష్యం.

త్యక్తసర్వపరిగ్రహస్య యతేః అన్నాదేశ్శరీరస్థితిహేతోః పరిగ్రహస్యాభావాత్ యాచనాదినా శరీరస్థితిక ర్తవ్యతాయాం ప్రాప్తాయాం। శ్లో॥ అయాచితమసంక్లిప్తముపపన్నం యదృచ్ఛయేత్యాదినా వచనేనానుజ్ఞాతం యతేః శరీరస్థితిహేతోరన్నాదేః ప్రాప్తిద్వారం ఆవిష్కుర్వన్నాహ॥ యదృచ్ఛేతి॥ యదృచ్ఛాలాభసంతుష్టః అప్రార్థితోపనతో లాభో యదృచ్ఛాలాభః తేన సంతుష్టః సంజాతాలంప్రత్యయః। ద్వంద్వాతీతః ద్వంద్వైశ్శీతోష్ణాదిభి రభిహన్యమానో ప్యవిషణ్ణచిత్తః ద్వంద్వాతీతఉచ్యతే। విమత్సరః విగతమత్సరః నిర్వైరబుద్ధిః సమస్తుల్యో యదృచ్ఛాలాభస్య సిద్ధావసిద్ధౌచ యఏవంభూతో యతిరన్నాదేః శరీరస్థితిహేతోర్లాభాలాభయోస్సమః హర్షవిషాదవర్జితః కర్మాదావకర్మాదిదర్శీ యథాభూతాత్మదర్శననిష్ఠస్సన్ శరీరస్థితిమాత్రప్రయోజనే భిక్షాటనాదౌ కర్మణి శరీరాది

నిర్వర్త్యైనైవ కించిత్కరోమ్యహం గుణాగుణేషు వర్తంత ఇత్యేవం సదాపరిసంచక్షాణః ఆత్మనః కర్తృత్వాభావం పశ్యన్ నైవ కించిద్భిక్షాటనాదికం కర్మ కరోతి లోకవ్యవహారసామాన్యదర్శనేనతు లౌకికైరేవ ఆరోపితకర్తృత్వాత్ భిక్షాటనాదౌ కర్మణి కర్తాభవతి స్వానుభవేనతు శాస్త్రప్రమాణజనితేనాకర్తైవ సఏవం పరాధ్యారోపితకర్తృత్వః శరీరస్థితిమాత్రప్రయోజనం భిక్షాటనాదికం కర్మ కృత్వాపి ననిబధ్యతే। బంధహేతోః కర్మణః సహేతుకస్య జ్ఞానాగ్నినా దగ్ధత్వాదిత్యుక్తానువాదఏషః ॥

As the sage who has given up all his possessions does not possess even things such as food &c. which are necessary for the sustenance of the body, it follows that he has to maintain his body by begging &c. The Lord points out to Yathi the ways of acquiring food &c. which are necessary for the maintenance of the body, as approved in the following text.

"What is not begged for, what is not previously secured, what has been obtained without effort..."

He who has said to himself 'enough' with what has been acquired unasked, who is not afflicted in mind when troubled by the pairs of opposites such as heat, cold &c, who is free from the feelings of envy and enmity, and who is even both in the acquisition or loss of what he might get without efforts, the Yathi of this description being free from joy or sorrow for success or failure in acquiring what is necessary for the sustenance of the body, seeing in-action in action, and vice versa, being ever devoted to the realisation of the real self, having engaged the body &c. in the act of begging with the object of mere sustaining the body, with the notion of non-agency as in "I do nothing at all, the senses act upon things" and thus realising non-agency, does not really act even in the act of begging. As he seems to be the *kartha* of the action of begging &c. as in the case of the generality of men, agency is imputed to him by the ordinary people. But from his own point of experience as based upon the authority of the Sastra, he is not the agent at all. Although such a man thus does the acts of begging &c. with the mere object of sustaining his

body, in which agency is imputed to him by others, he is not really bound. For, he has burnt up in the fire of knowledge all karma with its cause which is the cause of bondage. All this is only a repetition of what has been said before.

———:0:———

## తాత్పర్యము.

సమస్తవస్తుసంగ్రహమును విడిచిపెట్టిన యతికి శరీరస్థితికి కారణమైన అన్నాదికముయొక్క పరిగ్రహము లేకపోవుటవలన యాచనమొదలగు వానిని చేసి శరీరమును నిలుపుకొనవలసియున్నది. అట్టిఅన్నాదికములను గ్రహించుమార్గమును కృష్ణుడీశ్లోకములో చెప్పుచున్నాడు. మఱియును అప్రయత్నముగా లభ్యమైన దానితో తృప్తినిపొందినవాడును, శీతోష్ణాదిద్వంద్వములను అతిక్రమించినవాడును, దేనియందును వైరబుద్ధిలేనివాడును, అప్రయత్నముగ అన్నాదికము సిద్ధించినను సిద్ధింపకపోయినను సమబుద్ధికలవాడును అయిన ముముక్షువు కర్మాదికమునందు అకర్మాదికమును చూచువాడును, కూటస్థాత్మనిష్ఠుడును అయి శరీరము నిలుచుటమాత్రమె ప్రయోజనముగాగలదియును, శరీరాముల చే నెరవేర్పదగినదియును అయిన భిక్షాటనాదికర్మమునందు "అ 5 శ్లో॥ 8 నైవకించిత్కరోమీతి" "అ 3 శ్లో॥ 28 గుణాగుణేషువర్తంతే" (నేను దేనినిజేయువాడనుకాను. ఇంద్రియములు విషయములయందు ప్రవర్తించుచున్నవి.) అని సర్వకాలములయందును స్పష్టముగజెప్పుచు తనకు కర్తృత్వములేకపోవుటనుచూచుచు భిక్షాటనము మొదలగు కర్మములలో దేనిని జేయుచుండలేదని యెరుగవలయును. ముముక్షువగు యతికి అవివేకులతోగూడ స్నానాచమనాది వ్యవహారము సమానముగానే కనబడుచుండుటవలన దానిననుసరించి అవివేకులచేత ఆరోపింపబడిన కర్తృత్వభోక్తృత్వములు కలవాడగుటవలన విద్వాంసుడుకూడ లోకదృష్టిచేత భిక్షాటనాదికమునందు కర్తృత్వముకలవానివలె గనబడుచున్నప్పటికిని శాస్త్రప్రమాణముచేత కలిగిన స్వానుభవముచేత అకర్త్రాత్మాది సంధానమే కలిగియుండుటవలన భిక్షాటనాదిచేష్టలయందుగూడ కర్తృత్వములేనివాడే అగుచున్నాడని యెఱుంగవలయును. సహేతుకమును బంధహేతుకమును అయిన కర్మను జ్ఞానాగ్నిచేత కాల్చబడియుండుటవలన కర్మముచేత బద్ధుడుకాడు.

అన్నాదేః :— the term అది includes పాదుకా ఆచ్ఛాదికాని *i. e.*, Sandals, umbrella &c.,

లోకవ్యవహారసామాన్య :— లౌకికైః అవివేకిభిః సహ వ్యవహారస్య స్నానాచమన భోజనాదిలక్షణస్య విదుషాం సామాన్యేన దర్శనాత్ :— The ignorant people impute agency to the acts of Yathi, for he seems to do such acts as eating, bathing &c., like the generality of mankind.

యదృచ్ఛాలాభః= అయత్నప్రాప్తోలాభః, " ప్రారబ్ధవశాత్ స్వత ఏవ ప్రాప్తః అసాధునా వా సాధునా వా దత్తః శుద్ధోఽశుద్ధో వా అల్పోఽనల్పోవా అన్నాదిః ".

---

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ 23

—:0:—

టీక.

గతసంగస్య = అభిమానము లేనివాడును, ముక్తస్య = (కామక్రోధాదిమూలమగు సంసారమునుండి) విడువబడినవాడును, జ్ఞానావస్థితచేతసః = బ్రహ్మజ్ఞానమందు నిలిచియున్న చిత్తముకలవాడును, యజ్ఞాయ = విష్ణుప్రీతికొరకు, ఆచరతః = (యజ్ఞాదికర్మమును) ఆచరించుచున్నవాడును, (అయిన) అస్య = ఈబ్రహ్మజ్ఞానియొక్క, కర్మ = కర్మము, సమగ్రం = ఫలముతోగూడ, ప్రవిలీయతే = నశించుచున్నది.

Of him who has lost all attachment, who is liberated, whose mind rests on knowledge and who acts for the sake of sacrifice, all karma is wholly destroyed. 23.

—::0::—

## Com. భాష్యం

త్యక్త్వా కర్మఫలాసంగమిత్యనేన శ్లోకేన యః ప్రారబ్ధకర్మా సన్ యదా నిష్క్రియబ్రహ్మాత్మదర్శనసంపన్నస్స్యాత్తదా తస్యాత్మనః కర్తృకర్మప్రయోజనాభావదర్శినః కర్మపరిత్యాగే ప్రాప్తే కుతశ్చిన్నిమిత్తాత్తదసంభవేసతి పూర్వవత్ తస్మిన్కర్మణి అభిప్రవృత్తస్యాపి నైవకించిత్కరోతి స ఇతి కర్మాభావః ప్రదర్శితః యస్యైవం కర్మాభావో దర్శితస్తస్యైవం ॥ గతసంగస్యేతి ॥ గతసంగస్య సర్వతో నివృత్తసంగస్య యతేః ముక్తస్య నివృత్తధర్మాధర్మాదిబంధనస్య జ్ఞానావస్థితచేతసః జ్ఞానఏవావస్థితం చేతో యస్య సోయం జ్ఞానావస్థితచేతాః తస్య యజ్ఞాయ

యజ్ఞనిర్వృత్త్యర్థమాచరతో నిర్వర్త్యత ఃకర్మ సమగ్రం సహాగ్రేణ ఫలేన వర్తత ఇతి సమగ్రం కర్మ తత్సమగ్రం ప్రవిలీయతే వినశ్య

It has been said in the verse "having abandoned attachment for the fruit" (త్యక్త్వాకర్మ), that a man who having first started with karma subsequently realises the identity of the self with the actionless Brahma, and sees the absence of the distinctions of agency, action and result, in the self, but who though competent to abandon karma would still continue to do it as before for some reason, does nothing at all as shown in "he does nothing." It is about this man who has been described as doing nothing that the Lord says in this verse. From whom attachment in all directions has gone away, who is freed from the bondage of Dharma and Adharma, whose mind is steadfast in the knowledge of the self and who does karma for the sake of Yajna, his karma with its results will pass into nothing.

తాత్పర్యము.

లోకములో ఏమానవుడు ప్రారబ్ధకర్మము కలవాడగుచు ఎప్పుడు నిష్క్రియబ్రహ్మాత్మజ్ఞానముకలవాడగునో అప్పుడు ఆత్మకు కర్తృకర్మమువలన ప్రయోజనములేదని తెలిసికొనుచున్న యీబ్రహ్మజ్ఞానికి ఒకవేళ ఏదోయొక కారణముచేత కర్మపరిత్యాగముసంభవింపకపోవుచుండగా బ్రహ్మజ్ఞానము కలుగునప్పటివలెనే కర్మమునందు ప్రవర్తించినప్పటికిని కర్మఫలాభిలాషను వదలుకొని ప్రవర్తించినయెడల ఏకర్మమును చేయనివాడే అగుచున్నాడని "అ 4. శ్లో॥ 20 త్యక్త్వా కర్మఫలాసంగం" అనుశ్లోకముచేత తెలియజేయబడెననియును అట్లుకర్మఫలాభిలాషను వదలినవానినిగురించియే యీశ్లోకమునుకూడ భగవంతుడగు కృష్ణుడు చెప్పుచున్నాడనియును తెలియవలయును. మఱియును అయితే జ్ఞానమునే కోరుచున్నవానియొక్క జ్ఞానమునకు భగవత్ప్రీతికొరకు ఆచరించుచున్న కర్మముమాత్రము ప్రతిబంధకముకాదా? అనిశంకింపక భగవత్ప్రీతికొరకుచేయబడుచున్న యజ్ఞాదికర్మము ఫలముతోగూడ నశించిపోవుచున్నదని యెరుంగవలయును.

*Notes.*

అభిప్రవృత్తః = engaged in action.

ధర్మాధర్మబంధనస్య :— Adhrama being a bad karma is a bondage; How is the Dharma or righteous karma sanctioned by the Sastra a cause of bondage? For a man desirous of moksha, good deeds also are the cause of bondage. Good karma yields good results and leads to good worlds. The performer of good karma must re-incarnate to experience the fruits of good karma. That which causes brith and death is a bondage and samsara; so to a liberated man good deeds also are bondage

సమగ్రం :— అగ్ర means the end; the end of karma is its fruits; the expression means with its results.

యజ్ఞార్థం = for the sake of Isvara, (పరమేశ్వరారాధనార్థం భగవతో నారాయణస్య ప్రీత్యర్థం".

It is said "యజ్ఞో వై విష్ణుః" Yajna is verily Vishnu.

ప్రవిలీయతే = attains the state of no-action అకర్మభావమాపద్యతే.

---

బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం ।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥ 24

——::o::——

టీక.

అర్పణం = (హోమసాధనమయిన) స్రుక్స్రువాదికము, బ్రహ్మైవ = బ్రహ్మస్వరూపమే, హవిః = (అన్నము, నేయి, మొదలగునవి) హోమద్రవ్యసముదాయము, బ్రహ్మైవ బ్రహ్మస్వరూపమే, బ్రహ్మణా = (బ్రహ్మస్వరూపుడైన) యజమానునిచేత, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మస్వరూపమయిన అగ్నియందు, హుతం = (చేయబడు) హోమము, బ్రహ్మైవ = బ్రహ్మమే, బ్రహ్మకర్మసమాధినా = బ్రహ్మమనియెడు కర్మమునందే చిత్తైకాగ్రతకల, తేన = ఆయజమానునిచేత, గంతవ్యం = పొందదగినఫలమును, బ్రహ్మైవ = బ్రహ్మమే.

The means by which the oblations are offered is Brahma; the oblation is Brahma; the (act of) offering the oblation into the fire of Brahma, by Brahma, the offerer, is Brahma; the fruit to be reached by one intent upon Brahma karma is Brahma.

## Com. భాష్యం

-::0::-

కస్మాత్పునః కారణాత్ క్రియమాణం కర్మ స్వకార్యారంభమకుర్వత్సమగ్రం ప్రవిలీయత ఇత్యుచ్యతే యతః॥ బ్రహ్మార్పణమితి॥ బ్రహ్మార్పణం యేన కరణేన బ్రహ్మవిద్ధవిరగ్నావర్పయతి తద్బ్రహ్మైవేతి పశ్యతి తస్యాత్మవ్యతిరేకేణాభావం పశ్యతి యథా శుక్తికాయాం రజతాభావం పశ్యతి తదుచ్యతే బ్రహ్మైవార్పణమితి యథా యద్రజతం తచ్ఛుక్తికైవేతి। బ్రహ్మార్పణమిత్యసమస్తే పదే యదర్పణబుద్ధ్యా గృహ్యతే లోకే తదస్య బ్రహ్మవిదో బ్రహ్మైవేత్యర్థః॥ బ్రహ్మహవిః తథా యద్ధవిర్బుద్ధ్యా గృహ్యమాణం తద్బ్రహ్మైవాస్య తథా బ్రహ్మాగ్నావితి సమస్తం పదం అగ్నిరపి బ్రహ్మైవ। యత్ర హూయతే బ్రహ్మణా కర్త్రా బ్రహ్మైవ కర్తేత్యర్థః। యత్తేన హుతం హవనక్రియా తద్బ్రహ్మైవ యత్తేన గంతవ్యం ఫలం తదపి బ్రహ్మైవ బ్రహ్మకర్మసమాధినా బ్రహ్మైవ కర్మ బ్రహ్మకర్మ బ్రహ్మకర్మణి సమాధిర్యస్య సః బ్రహ్మకర్మసమాధిస్తేన బ్రహ్మకర్మసమాధినా బ్రహ్మైవ గంతవ్యమేవం లోకసంగ్రహం చికీర్షుణాపి క్రియమాణం కర్మ పరమార్థతో అకర్మ బ్రహ్మబుద్ధ్యుపమృదితత్వాన్నివృత్తకర్మణోపి సర్వకర్మసన్న్యాసినః సమ్యగ్దర్శనస్తుత్యర్థం యజ్ఞత్వసంపాదనం జ్ఞానస్య సుతరాముపపద్యతే। యదర్పణాది అధియజ్ఞే ప్రసిద్ధం తదస్యాధ్యాత్మం బ్రహ్మైవ పరమార్థదర్శిన ఇతి। అన్యథా సర్వస్య బ్రహ్మత్వే సతి అర్పణాదీనామేవ విశేషతో బ్రహ్మత్వాభిధానమనర్థకం స్యాత్ తస్మాద్బ్రహ్మైవేదం సర్వమితి జానతః కర్మాభావః కారకబుద్ధ్యభావాచ్చ నహి కారకబుద్ధిరహితం యజ్ఞాఖ్యం కర్మ దృష్టం సర్వమేవాగ్నిహోత్రాదికం కర్మ శబ్దసమర్పితదేవతాపిశేషసంప్రదానాది కారకబుద్ధిమత్కర్త్రభిమానఫలాభిసంధిమచ్చ దృష్టం నోపమృదితక్రియాకారకఫలభేదబుద్ధికర్తృత్వాభిమానఫలాభిసంధిరహితంవా ఇదంతు బ్రహ్మ బుద్ధ్యుపమృదితార్పణాది కారకక్రియాఫలభేదబుద్ధిమత్ కర్మ అతోఽకర్మైవ తథాచ దర్శితం కర్మణ్యకర్మ యః పశ్యేత్కర్మణ్యభిప్రవృత్తోపి నైవకించిత్కరోతిసః। గుణాగుణేషువర్తంతే నైవకించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ఇత్యాదిభిస్తథాచ దర్శయంస్తత్ర తత్రక్రియాకారకఫలభేదబుద్ధ్యుపమర్దనం కరోతి దృష్టాచ కామ్యాగ్నిహోత్రాదౌ

కామోపమర్దే కామ్యాగ్నిహోత్రాదిహానిస్తథా మతిపూర్వకామతిపూర్వకా
దీనాం కర్మణాం కార్యవిశేషస్యారంభకత్వం దృష్టం తథేహాపి బ్రహ్మ బుద్ధ్యుప
మృదితార్పణాది కారకక్రియాఫలభేదబుద్ధేర్బాహ్యచేష్టామాత్రేణ కర్మాపి విదు
షః అకర్మసంపద్యతే। అతఉక్తం సమగ్రంప్రవిలీయతఇతి అత్రకేచిదాహుః య
ద్బ్రహ్మ తదర్పణాది బ్రహ్మైవకిల అర్పణాదినా పంచ విధేనకారకాత్మనావస్థితం
సత్ తదేవ కర్మ కరోతి తత్ర నార్పణాదిబుద్ధిర్నివర్త్యతే। కింత్వర్పణాదిషు బ్ర
హ్మబుద్ధిరాధీయతే యథా ప్రతిమాదౌ విష్ణ్వాదిబుద్ధిర్యథావా నామాదౌ బ్రహ్మ
బుద్ధిరేవమితి సత్యమేవమపి స్యాద్యది జ్ఞానయజ్ఞస్తుత్యర్థం ప్రకరణం నస్యాదత్ర తు
సమ్యగ్దర్శనం జ్ఞానయజ్ఞశబ్దితమనేకాన్ యజ్ఞశబ్దితాన్ క్రియావిశేషాన్ ఉపన్య
స్య శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞఇతి జ్ఞానయజ్ఞం స్తౌతి। అత్రచ
సమర్థమిదం వచనం బ్రహ్మార్పణమిత్యాది జ్ఞానస్య యజ్ఞత్వసంపాదనే యేత్వర్ప
ణాదిషు ప్రతిమాయాం విష్ణ్వాదిదృష్టివద్బ్రహ్మదృష్టిః క్షిప్యతే నామాదిష్వివ చేతి
బ్రువతేన తేషాం బ్రహ్మవిద్యోక్తేహ వివక్షితా అర్పణాదివిషయత్వాత్ జ్ఞానస్య
నచ దృష్టిసంపాదనజ్ఞానేన మోక్షఫలం ప్రాప్యతే బ్రహ్మైవ తేన గంతవ్యమితి
చోచ్యతే। విరుద్ధంచ సమ్యగ్దర్శనమంతరేణ మోక్షఫలం ప్రాప్యతఇతి ప్రకృతవి
రోధశ్చ సమ్యగ్దర్శనంచ ప్రకృతం కర్మణ్యకర్మయఃపశ్యేదిత్యత్ర అంతేచ సమ్యగ్ద
ర్శనస్యైవ ఉపసంహారాత్ శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః। జ్ఞానం
లబ్ధ్వా పరాంశాంతిమిత్యాదినా సమ్యగ్దర్శనస్తుతిమేవ కుర్వన్నుపక్షీణోధ్యాయః
తత్ర అకస్మాదర్పణాదౌ బ్రహ్మదృష్టిప్రకరణే ప్రతిమాయామివ విష్ణుదృష్టిరుచ్యత
ఇత్యనుపపన్నం తస్మాద్యథా వ్యాఖ్యాతార్థ ఏవాయంశ్లోకః॥

It is here stated why the karma performed by the man of the above description is entirely lost without producing its results.

The knower of Brahma views the instrument with which the oblations are poured into the fire, as *one* with Brahma, *i. e.*, does not see it as having an existence distinct from that of the self, just as silver is not realised as having a separate existence from that of the mother-of-peral (mistaken for silver); what is believed to be silver in the above illustration is only the mother-of-pearl. In the uncompounded expression 'బ్రహ్మ అర్పణం' what is regarded by

the ordinary people as the instrument of oblation is in the eye of the knower of Brahma only Brahma. Brahma is the oblation of the clarified butter &c., *i. e.*, what is looked upon as the oblation is only Brahma to the knower of Brahma. బ్రహ్మాగ్నౌ is a compound expression meaning that the fire in which oblations are offered is nothing but Brahma. The oblations are poured by Brahma *i. e.*, the agent who offers the oblations is no other than Brahma. The act of offering is no other than Brahma the result to be attained by him whose mind is centred in the realisation of karma as Brahma, is nothing but Brahma. Thus the karma performed by one who does it that the world might follow him, is really no-karma, as it has been effaced by the realisation of karma as Brahma. This being so this treatment, as Yajna, of the knowledge of one who has retired from action, who has abandoned all karma and has realised the self, with a view to eulogise the knowledge, is quite appropriate here. The well known auxiliaries such as the instruments &c, in the actual sacrifice are only Brahma to him who has realised the highest self which is Brahma, the individual self in him. Otherwise it is objectless to mention specifically the auxiliaries of the sacrifice as Brahma, when everything is Brahma. Therefore to the enlightened man who knows that all this is Brahma, all action ceases to exist, by reason of the absence of the egoism of agency also. Indeed no karma known as yajna is possible in the obsence of the notion of agency. All karma such as the Agnihotra &c., is seen to be connected with the notion of specific gods, and the accessories of karma and also associated with agency, attachment and fruits of action. It is never found devoid of the notion of the auxiliaries of action, agency, and fruits of karma unaccompanied with egoism and a desire for results. But the sacrifice of knowledge is the karma in which the idea of the instruments, agent, action, result &c., of sacrifie is obliterated by reason of the accessories of sacrifie being viewed as Brahma; this (wisdom sacrifice karma) is therefore no-karma. Similarly it has been shown in the verses "కర్మణ్యకర్మ యః పశ్యేత్..." (Ad. 4 of 20) "గుణా గుణేషు వర్తంతే" (Ad. 3 of 28), "నైవకించిత్ కరోమి..." (Ad. 5 of 8) Thus showing, the Lord has tried to

obliterate the notion of distinctions as to action, agency and fruits, here and there. It is seen (in karma kanda) that the Agnihothra karma performed with a certain desire and purpose, ceases to be such when the desire disappears; likewise it is seen in the world that actions performed knowingly or unknowingly produce distinct results. Here also the karma of the enlightened man, though appearing as such to all outward appearances, becomes no-karma, by reason of the notion of distinctions of action, actor, and result being removed by the idea of their being Brahma; therefore it is properly said that all action dissolves (Ad. 4 V. 23). Some interpret the passage in a different way. What is known as Brahma is the instruments, actor &c, of action (of the sacrifice); it is indeed Brahma that does the karma, manifesting himself in the five forms of instruments, actor and so on. Here the idea of the instrument, actor and auxiliaries (of the sacrifice) does not go away. On the otherhand the notion of Brahma is directed to be fixed on the instrument &c., just as the idea of Vishnu is fixed on an idol, and that of Brahma on 'name' (Rama &c.). Even this interpretation would be right if the context did not refer to the eulogy of the knowledge-sacrifice. On the other hand the Lord having described the several acts of worship under the name of Yajnas, extols the knowledge in the terms "Superior is the wisdom-sacrifice to the sacrifice with objects"; and it may faily be said that the verse 'బ్రహ్మార్పణం..." aims at representing knowledge as sacrifice. Otherwise the mention of instruments &c., in particular, as Brahma, when everything is Brahma becomes objectless. But if it be contended that the notion of Brahma should be fixed on the instruments, actor &c., just as the notion of Vishnu is fixed on an idol and the idea of Brahma is fixed on 'name', then the knowledge of *Brahma* which has hitherto been treated of would not become the subject of the teaching here; for the insrument, action and other auxiliaries of Sacrifice would be the object of knowledge (according to the interpretation); again no Moksha (final liberation) can be attained by that knowledge which is of the form of fixing the notion of Vishnu on the instrument of sacrifice. It has been said in the verse that Brahma (Moksha) is the goal to be reached by him. It is really inconsistent to

say that Moksha can be attained without the knowledge of Brahma. The intreprotation is also inconsistent with the context. The knowledge of the self is the topic of the discourse as apprears from the verse "he who sees in-action in action—" and the last portion of the discourse is concluded with the same knowledge as shown in the verses "Wisdom sacrifice, O Parantapa, is superior to sacrifice with objects", "having attained knowledge one attains the highest peace". Thus extolling the perfect knowledge, the adhyaya concludes. Accordingly it is not appropriate to say that abruptly and without any regard to the present subject, it is taught that the notion of Brahma is to be fixed on the instruments &c., of the sacrifice just as the notion of Vishnu is fixed on an idol. Therefore this verse is to be interpreted as commented upon.

———:0:———

తాత్పర్యము.

చేయబడుచున్నకర్మము ఫలమునుకలుగజేయకయే పరీతిగా నశించుచున్నదనిన్ని బ్రహ్మవేత్తచేయుకర్మము ప్రకారణముచేత కర్మముకాదనిన్ని అర్జునుడు అడుగునేమోయనితలచి కృష్ణుడు ఈశ్లోకములో సమాధానముచెప్పుచున్నాడు. సర్వము బ్రహ్మమనుజ్ఞానముకలుగగానే కర్మమునకు కారణమగు అవివేకము నశించును. అందువలన వేత్తయగువానికర్మము కర్మముకాదు. కారిన్ని బ్రహ్మవేత్త లోకసంగ్రహముకొరకు కర్మమునుచేయుచున్నను స్రుక్స్రువాదికమంతయును బ్రహ్మమే అనుబుద్ధితో యజ్ఞకర్మమునుచేయుచుండుటచేత అది కర్మముకాదని కృష్ణుడు సమాధానముచెప్పుచున్నాడు. బ్రహ్మవేత్తయగువాడు బ్రహ్మముకంటె వేరైనదియేదియును లేదుగనుక హవిస్సు అగ్నియందు సమర్పించుటకు సాధనములగు స్రుక్స్రువాదులు బ్రహ్మమని తెలిసికొనుచున్నాడు. ముత్యపుచిప్పయందు రజతాభావమును ప్రసిద్ధముగాచూచునో ఆరీతిగానే బ్రహ్మవేత్త స్రుక్స్రువాములను ఆత్మకంటె భిన్నమైనపదార్థముగా చూడడు. బ్రహ్మఅర్పణము అనుఅసమస్తప్రయోగమందు అర్ధమేమనగా లోకదృష్టిని అర్పణముగా నూహించబడినపదార్థము బ్రహ్మవేత్తకు బ్రహ్మమేయగుచున్నది. హోమద్రవ్యములగు ఘృతాదులు బ్రహ్మమే. బ్రహ్మాగ్నౌ అనునది సమస్తపదం అగ్నికూడ బ్రహ్మమే. బ్రహ్మస్వరూపుడైన యజమానునిచేత బ్రహ్మస్వరూపమగు అగ్నియందు చేయబడు

హోమమును బ్రహ్మమే. జ్ఞాననిష్ఠగలవానిచేత పొందబడతగినఫలముకూడ బ్రహ్మ
మే. ఈరీతిగా కర్మమును చేయు బ్రహ్మవేత్తచేతను లోకసంగ్రహముకొరకు బ్రహ్మ
బుద్ధితో చేయబడుకర్మము కర్మము కాజాలదు. సర్వకర్మసన్న్యాసియగు బ్రహ్మవేత్త
యొక్క బ్రహ్మజ్ఞానమునకు యజ్ఞత్వసంపాదనము అనగా జ్ఞానయజ్ఞముగా చెప్పుట
బ్రహ్మజ్ఞానమును స్తోత్రము చేయుటకై యున్నదనుట యుక్తము. ఇట్లు కాదేని సర్వ
ము బ్రహ్మమే అయియుండగా స్రుక్స్రువములు, హవిస్సు, అగ్ని, యజమానుడు,
హోమకర్మము అనునవిమాత్రము బ్రహ్మస్వరూపమని చెప్పుట నిరర్థకమగును.
అయితే లోకములో అగ్నిహోత్రాదికముగాని, మరియేకర్మముగాని, కర్మము,
దేవత, కరణము, కర్త, ఫలము అను భిన్నజ్ఞానము లేకయే లేదు. అయితే బ్రహ్మ
వేత్త చేయుజ్ఞానయజ్ఞమందు బ్రహ్మబుద్ధిచేత కర్తాకరణాది భేదజ్ఞానము నశింపబడు
టచేత వానియొక్క కర్మము అకర్మమగుచున్నది. బ్రహ్మవేత్తకు క్రియాకారకఫ
లభేదబుద్ధి లేదని గీతలలో "కర్మణ్యభిప్రవృత్తోపి..." "గుణాగుణేషువర్తంతే"
"నైవకించిత్కరోమీతి..." శ్లోకములలో చెప్పబడినది. బ్రహ్మవేత్త మూఢునివ
లె కర్మమునందు ప్రవృత్తికలవాడుగానున్నను బ్రహ్మబుద్ధిచేత నశింపజేయబడిన
ద్వైతబుద్ధికలవాడగుటచేత వానికర్మము అకర్మమగుచున్నదనుటకు మరియొక
నిదర్శనముకలదు. లోకములో కామ్యాగ్నిహోత్రముచేయువానికి కామము
నశించినపిదప ఆ అగ్ని కామ్యాగ్ని కాకపోవుచున్నది. మరియును బుద్ధిపూర్వకము
గాను అబుద్ధిపూర్వకముగాను చేయబడుకర్మములకు ఫలభేదము కలిగియున్నది.
ఈశ్లోకమునకు కొందరు వేరుగా వ్యాఖ్యానము చేయుచున్నారు. ప్రతిమాదులయం
దు విష్ణుబుద్ధియును, రామాదినామములయందు బ్రహ్మబుద్ధియును కలిగియున్న
ట్లు యజ్ఞకరణాదులయందు బ్రహ్మబుద్ధికలిగి కర్మము చేయవలయును. బ్రహ్మము
నందు స్రుక్స్రువాది బుద్ధికలుగుచుండలేదనియును ఇచ్చట భేదబుద్ధినశించుట లేద
నియును చెప్పుచున్నారు. ఈవ్యాఖ్యానము సరికాదు. జ్ఞానయజ్ఞమును స్తోత్రముచే
యుటకు ఈశ్లోకము ప్రవర్తించినది. ఈప్రకరణములయందు అనేకయజ్ఞములను చెప్పి
(అ. 4. 33. శ్లోకములో) జ్ఞానయజ్ఞమును స్తోత్రము చేయుచున్నాడు. పూర్వపక్షి
చెప్పిన ఆక్షేపణసరియైనయెడల ఈప్రకరణము బ్రహ్మవిద్యను ప్రతిపాదించుప్రకర
ణము కాకపోవును. మరియును "బ్రహ్మైవతేనగంతవ్యం" అనువాక్యముచేత స్ప

క్స్రువాదులు బ్రహ్మస్వరూపములనియెడు తలంపుతో యజ్ఞమును చేయుచున్న యజమానికి మోక్షముకలుగునని చెప్పబడియుండుటవలనగూడ ప్రతిమాదులయందు విష్ణుబుద్ధికలిగినట్లు స్రుక్స్రువము మొదలగు వానియందు బ్రహ్మబుద్ధి కలుగుచున్నదని చెప్పుటయుచితముకాదని తెలియవలయును. ,, అ. 4. శ్లో. 33. శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాజ్జ్ఞానయజ్ఞః పరంతపః ” అనుశ్లోకముచేత ఆత్మజ్ఞానమువే ఉపసంహారముచేయుటవలనను ఆలోచించిచూడగా కూటస్థాత్మజ్ఞానము పరిష్కృతమైయుండుటవలన స్రుక్- స్రువము మొదలుగాగలవి బ్రహ్మస్వరూపములయినవని తెలిసికొనుటనుగురించి ఈశ్లోకమును చెప్పలేదని యెరుగవలయును.

### *Notes.*

ప్రవిలాపనప్రకారమాహ.

అర్పణ=దమసప్రస్రుక్స్రువాదికం ; బ్రహ్మైవ = ప్రత్యక్దృష్ట్యాబ్రహ్మవిత్పశ్యతి, మూఢదృష్ట్యాయద్రజతంతదేవ వివేకదృష్ట్యాశుక్తిః !

The mother-of-pearl is mistaken by the foolish for silver : The wise understand it in its real state *i. e.,* what is understood by the ingnorant as silver is really the mother-of-pearl in the eye of the wise.

హవిః=దరుపురోడాశాదికం; బ్రహ్మాగ్నౌ =హోతకర్త్రీయజమానం స్వం బ్రహ్మవిత్ బ్రహ్మైవ పశ్యతి ; అగ్నిః=హోమాధికరణం ;

బ్రహ్మకర్మసమాధి :— సర్వస్యబ్రహ్మమాత్రత్వదర్శనం యత్ తద్బ్రహ్మకర్మతస్మిన్ బ్రహ్మకర్మణి సమాధిః చిత్తస్యస్థాపనంయస్స *i. e.,* సర్వంబ్రహ్మైవపశ్యతాబ్రహ్మవిదా...

---

దైవమేవాపరేయజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరేయజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥ 25

-:0:-

టీక.

అపరే= మరికొందరు, (అయిన) యోగినః= యోగులు, (కర్మనిష్ఠులు) దైవమ్ = ఇంద్రాదిదేవతలనుద్దేశించి చేయబడునట్టి, యజ్ఞమేవ = (జ్యోతిష్టోమాది) యజ్ఞమునే, పర్యుపాసతే = (ఫలాపేక్షతో) చేయుచున్నారు. అపరే = మఱికొందరు, (బ్రహ్మవేత్తలు) యజ్ఞే,

నైవ = నిరుపాధికుడైన ఆత్మచేతనే, (బ్రహ్మాత్మైకత్వభావనచేతనే) యజ్ఞమ్ = ఉపాధితో గూడుకొనిన ఆత్మను, (జీవుని) బ్రహ్మాగ్నౌ = నిరుపాధికమయిన పరబ్రహ్మ అనునట్టి అగ్నియందు ఉపజుహ్వతి = హోమము చేయుచున్నారు.

Some Yogins (devoted to karma) perform only the sacrifices of Gods. Some others (the knowers of Brahma) offer up in the fire of Brahma, the embodied self by the self.

——::o::——

## Com. భాష్యం.

తత్రాధునా సమ్యగ్దర్శనస్య యజ్ఞత్వం సంపాద్య తత్ స్తుత్యర్థం అన్యేపి యజ్ఞా ఉపక్షిప్యంతే దైవమేవాపర ఇత్యాదినా। దైవమేవేతి। దైవమేవ దేవా ఇజ్యంతే యేన యజ్ఞేనాసౌ దైవో యజ్ఞః తమేవ అపరే యజ్ఞం యోగినః కర్మిణః పర్యుపాసతే కుర్వంతీత్యర్థః। బ్రహ్మాగ్నౌ। శ్రుతి। సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ। విజ్ఞానమానందం బ్రహ్మ। యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ। య ఆత్మా సర్వాంతర ఇత్యాదివచనోక్తమశనాయాపిపాసాది సర్వసంసారధర్మవర్జితం। నేతి నేతీతి నిరస్తాశేషవిశేషం బ్రహ్మ బ్రహ్మశబ్దేనోచ్యతే। బ్రహ్మ చ తదగ్నిశ్చ స హోమాధికరణత్వ వివక్షయా బ్రహ్మాగ్నిః తస్మిన్ బ్రహ్మాగ్నౌ అపరే అన్యే బ్రహ్మవిదో యజ్ఞం యజ్ఞశబ్దవాచ్యం ఆత్మానం ఆత్మనామసు యజ్ఞశబ్దస్య పాఠాత్ ఆత్మానం యజ్ఞం పరమార్థతః పరమేవ బ్రహ్మ సంతం బుద్ధ్యాద్యుపాధిసంయుక్తమధ్యస్తసర్వోపాధి ధర్మకమాహుతిరూపం యజ్ఞేనైవాత్మనైవోక్తలక్షణేనోపజుహ్వతి ప్రక్షిపంతి సోపాధికస్యాత్మనో నిరుపాధికేన పరబ్రహ్మస్వరూపేణైవ యద్దర్శనం స తస్మిన్ హోమస్తం కుర్వంతి బ్రహ్మాత్మైకత్వదర్శననిష్ఠాస్సన్న్యాసిన ఇత్యర్థః॥

Having described knowledge (wisdom) as a sacrifice (in the previous verse) the Lord describes other kinds of sacrifices with a view to extol wisdom-sacrifice in the verses beginning with the present verse. The Yogins *i. e.*, men devoted to karma perform Diva sacrifices *i. e.*, sacrifices by which the Devas are worshipped. The word Brahma denotes the thing described by the following texts " Brahma is truth, knowledge eternity " " Brahma is dense knowledge and Brahma is Ananda who is immediately realised and who is the *innermost self* of all". Brahma is one who is devoid of all the characteristics of Samsara, such as hunger, &c,

thirst &c, and who is not emanable to particularisation and specification, as disclosed by the Sruti "not this, not this". Brahma is represented as fire in reference to the oblations &c, of the sacrifice. Others means the knowers of Brahma. The word Yajna means the self, as it is mentioned in the list of the synonyms for self. Yajna which in truth is the Highest Brahma is the self which is conditioned by the vehicle of Budhi &c (understanding) and on whom all the attributes and qualities of the embodiment are falsely imposed; by Yajna *i. e.*, by the self possessing the aforesaid characteristics. This self of the form of oblation is poured into the fire of self by the self. This realisation of the conditioned self as one with the unconditioned Parabrahma is the offering. The meaning is the wise men who are devoted to the realisation of the self as one with the Brahma and who have relinquished all do this sacrifice.

———::o::———

## తాత్పర్యము.

పూర్వ శ్లోకముచేత జ్ఞానమునకు యజ్ఞత్వమును సంపాదించి యిప్పుడు జ్ఞానయజ్ఞమును స్తుతించుటకు కృష్ణుడు ఈశ్లోకము మొదలుకొని ఇతరయజ్ఞములనుచెప్పుచున్నాడు. దేవయజ్ఞమనగా ఇంద్రాదిదేవతలనుద్దేశించి చేయబడిన యజ్ఞము. కర్మయోగులు దేవయజ్ఞమును చిత్తశుద్ధికొరకు చేయుచున్నారు. బ్రహ్మ అనగా „ సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ, విజ్ఞా...బ్రహ్మ " అను శ్రుతివాక్యములచేత ఘోషింపబడునట్టిదియు ఆకలిమొదలుగు సంసార ధర్మములు లేనిదియును „ నేతి నేతి " అనుశ్రుతిచేత పోగట్టబడిన సమస్తవిశేషములు గలదియును అయినవస్తువు. అట్టిబ్రహ్మమను అగ్నియందు బ్రహ్మవేత్తలు బుద్ధ్యాద్యుపాధులతో గూడిన సంసారధర్మములు గలజీవాత్మను నిరుపాధికమగు నాత్మచేతను హోమమును చేయుచున్నారు. అనగా జీవాత్మ పరమాత్మకంటె అభిన్నుడను జ్ఞానముగలిగియుండుటయను హోమమును చేయుచున్నారు.

---

*Notes.*

In this and the subsequent verses the knowledge or wisdom sacrifice is extolled and other sacrifices are referred to as a means

to the knowledge-sacrifice and to show the superiority of wisdom-sacrifice. In this verse two kinds of sacrifices are mentioned.

దైవమేవ :— దేవ refers to ఇన్ద్ర, వరుణ &c.; the word ఏవ denotes that the devas, ఇన్ద్ర, వరుణ &c, are worshipped as such and as distinct from Brahma but not as identical with Brahma.

యజ్ఞం :— This word means ఆత్మ, the conditioned జీవాత్మా.

The Nirguna Parabrahma is the fire in which the offerings consisting of the conditioned జీవాత్మా is poured. The Jivathma though one with Paramathma is fancied to be the possessor of an embodiment and the faults of samasar, by virtue of Avidya. In the fire of Brahma Jiva as such is burnt up and then the real self becomes one with the Brahma. This is called knowledge-sacrifice (జ్ఞానయజ్ఞః). The realisation of the oneness of the Jivathma with the universal self is the knowledge-sacrifice. The Devas are within the pale of Samsara. The Iythereya Upanishad says 'Having created the devas he threw them into the ocean of samsara' "తాఏతాదేవతా సృష్టాఅస్మిన్మహత్యర్ణవే ప్రాపతన్"

---

శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥ 26

——::0::——

టీక.

అన్యే = మఱికొందఱగు నైష్ఠిక బ్రహ్మచారులు, శ్రోత్రాదీని = చెవిమొదలుగాగల, ఇంద్రియాణి = ఇంద్రియములను, సంయమాగ్నిషు = నియమములుఅనియెడు నగ్నులయందు, జుహ్వతి = హోమమునుచేయుచున్నారు, అన్యే = మఱికొందఱుగృహస్థులు, శబ్దాదీన్ = శబ్దముమొదలుగాగల, విషయాన్ = విషయములను, ఇంద్రియాగ్నిషు = ఇంద్రియములనియెడు నగ్నులయందు, జుహ్వతి = హోమమునుచేయుచున్నారు.

Some pour as offering hearing and other senses into the fires of restraint; some offer sound and other objects of senses into the fires of the senses.

——:0:——

**Com.** భాష్యం

సోయంసమ్యగ్దర్శనలక్షణోయజ్ఞో దైవయజ్ఞాదిషు యజ్ఞేషూపక్షిప్యతే బ్రహ్మార్పణ మిత్యాదినా శ్లోకైః శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞ

ఇత్యాదినా స్తుత్యర్థం ॥ శ్రోత్రాదీనితి ॥ శ్రోత్రాదీనింద్రియాణి అన్యే యోగినః సంయమాగ్నిషు ప్రతీంద్రియం సంయమో భిన్న ఇతి బహువచనం సంయమా ఏవాగ్నయః తేషు జుహ్వతి ఇంద్రియసంయమమేవ కుర్వంతీత్యర్థః ॥ శబ్దాదీన్ విషయానన్యే ఇంద్రియాగ్నిషు ఇంద్రియాణ్యేవ అగ్నయః తేష్వింద్రియాగ్నిషు జుహ్వతి శ్రోత్రాదిభిరవిరుద్ధవిషయగ్రహణం హోమం మన్యంతే ॥

The knowledge—sacrifice characterised by the realisation of oneness, is introduced by the verse బ్రహ్మార్పణం, with the subject of Gods' sacrifice &c. to extol it, as said in "Better is the knowledge-sacrifice than sacrifice with objects..." Some yogins pour as offerings hearing and other senses in the *fires* of restraint. The use of the plural *fires* is to show that the method of restraint is different for each sense. They are ever engaged in the restraint of the senses. Some others pour into the *fires* of senses the objects of the senses *i. e.*, They regard the enjoyment of the sensuous objects of hearing &c., not forbidden by the sastras, as a sacrifice.

———::o::———

తాత్పర్యము.

జ్ఞానయజ్ఞమును దేవాదియజ్ఞములయొక్క మధ్యను చెప్పుటకు కారణమేమని అర్జునుడడుగునేమోయని తలంచి కృష్ణుడు ఈశ్లోకములో జ్ఞానయజ్ఞముయొక్క శ్రేష్ఠత్వమును వర్ణించుటకు చెప్పుచున్నాడు. కొందరు నైష్ఠికబ్రహ్మచారులు మనోనియమములనియెడు అగ్నులయందు శ్రోత్రాదీంద్రియములను హోమము చేయుచున్నారు. అనగా ఇంద్రియనిగ్రహప్రధానులైయున్నారు. అనగా బాహ్యేంద్రియములను అంతరింద్రియములను నిగ్రహించుచున్నారు. మరికొందరు గృహస్థులు శబ్దములు మొదలుగాగల ఇంద్రియవిషయములను ఇంద్రియములను అగ్నియందు హోమముచేయుచున్నారు. అగ్నులనుబహువచనము ప్రతిఇంద్రియనిగ్రహమార్గము భేదముగానుండునని సూచించుచున్నది.

---

*Notes.*

In this verse two kinds of sacrifices are described; one is సంయమయజ్ఞం and the other is ఇంద్రియయజ్ఞం. The withdrawal of the inner and outer senses from their objects and the consequent restraint

